## కొవ్వలివారి ★ ★
## ★ ★ రాబోవు నవలలు

నీలివార్త
నాటకరాకాసి
శ్రీరంగనీతులు
కళ్లల్లో కారం
యమునితీర్పు
కాశీయాత్ర
కామాంధుడు
లాటరీటక్కరి 1 భా॥
డిటో 2 భా॥
ఆడపెత్తనం

శ్రీ సత్యనారాయణ
పబ్లిషింగ్ హౌస్
రాజమండ్రి.

# ఆఫీసర్

రచయిత:
కొండేపూడి సుబ్బారావు, బి ఏ., బి. ఇడి.,

K
Subba Rao.



ప్రకాశకులు:
పెనుపులేటి బాపిరాజు,
శ్రీసత్యనారాయణ పబ్లిషింగ్ హౌస్,
రాజమండ్రి.
1946



[వెల రు. 0—8—0.

# సూ చ న.

ఒక కుటుంబమునకు యజమాని ఏలాగు పెద్దవాడో అల్లే ఆఫీసుకు ఆఫీసరు పెద్దవాడు. ఇతడు ఆ ఆఫీసుకు సూత్రధారుడు. యితడు ఏలాగుచెప్పితే అతనికింది తాబేదార్లు అలాగుచేయువలెను. అదితప్పు అయినప్పటికి 'తప్పు'' అనిచెప్పే అధికారం అతనికిందివాళ్ళకు లేదు. అలాగుచెప్పినందుకు వాళ్ళకుశిక్ష కూడా విధింపబడుతుంది. కనుక ఆఫీసరుహోదాలోవున్న ప్రతివాళ్ళూ తమకు తెలిసినా తెలియకపోయినా తెలిసినట్టు నటించాలి. ఈచిన్నపుస్తకంలో రంగనాధమొదలియార్ గారు చేతకానివాడైనప్పటికీ ఆఫీసరుహోదాలోకి రావడంతోటే డబాయించి క్రిందివాళ్లను ఏలాగుఅణగదొక్కేవాడో సూచించబడ్డది.

ఇట్లు,

రచయిత.

## ౧

"ఏమండీ? బంకులుగారూ!" (పంతులుగారి కొచ్చినపాట్లు!)

'ఉ'

'ఏమండీ? పనిఅయినదా? ఆఫీసు తాళము వేసి యింటికినేరుగా, వూడ్సుదుమా?'

'నీపని అప్పుడే అయిందా?'

'అ. నా పనియేమిదా? వుంది! మూడు నిమిషములో చేసి పారవుతున్ను.'

'అవును. నువ్వుచేసేది డిస్పాచివర్కే కదా?'

'ఏమండీ?అట్లా సెప్తురుబందులుగారూ! డిస్పాచివర్కు మాత్రము సామాన్యమా? కవర్లు అంటించవలె. పేర్లువ్రాయవలె. ఏజాబుకా జాబు సరియైన ఎడ్రెసు వ్రాసిన కవరులో పెట్టవలె. లేకుంటే ఒకడికి వ్రాసిన వుత్తరం యింకొకడికి వూడుసును!'

'అవునయ్యా! ఆమాత్రం పనిచెయ్యలేకపోతే ఎందుకంటనీ చదువు! కాల్చనా? మళ్ళీ ఓల్డుమెట్రిక్యులేటు నంటావు. ఎప్పుడో గోదావరిబ్రిడ్జి పుట్టకమునుపు ప్యాసయ్యానంటావు? ఈమాత్రంపని చెయ్యలేవా?'

'చెయ్యలేనని కాదు చెప్తావుంట. రొంబాకష్టంగా వుంటున్న దిమీ అని చెప్తుండాను. నీపని బాగవుండాదే. రోజూ నాలుగువుత్తరాలు గీకిపారేస్తావు'

'అయ్యో! రామ! నాపనిచూసే నీవు సంతోషించాలి? పోనీ నాపని నీకంతసులభంగావుంటే మనమిద్దరము ఒకళ్ళపని యింకొళ్ళతో బదిలీచేసుకొందామా?'

'అది ఎట్లా వీలుఅగును?'

'అందుగదే నేను చెప్తావుంట. ఆఫీసరుమీవాడు మీదేశస్థుడు. మీభాషమాట్లాడుతాడు. అందుచేత మిమ్మల్ని కష్టపెట్టడు, కష్టపెట్టకూడదుకూడాను. తెలిసి అయినా, పేచీపూచీలు చేసినా మీకు యిస్తారు లా దీపీలు వృత్తి , సు చివక్కా వవున్నసిమా కురుద్దా తారు.' పోనీ నాకు ఈపనివద్దని అనలేకపోతివా? ఒకమాటుచెప్పి వుడుపుమీ.'

'ఏమిచెప్పటంలే బాబూ! యింత చింబు రహస్యం ఈ ఆఫీసులన్నాయేచూడు వట్టిదండగలు పెద్దపెద్ద జీతాలు ఇచ్చి ఇం తంత ఆఫీసర్లను పెట్టకం సుష్కాండగ.'

"బాగవుందయ్యా! బండలూ! నీవుసెప్పేది నిజముకూడా అంత దానే. మనము చక్కంగ యింగ్లీషులో డ్రాఫ్టువ్రాసి పట్టుకువెడితే దానిని వాడుదా యిష్టమువచ్చినట్లుదిద్ది అసలుదాని అర్థమే చెడగొడతాడు. అబ్బ! నాతలప్రాణముదా తోకకువెక్కిపోయిందిమి!'

'యింకానయం. నీవువ్రాసినదానిని దిద్దేడు. అందుకు సంతోషమే. ఒకొక్కడున్నాడే — వాడు చదువు ఏమిటో మనకు తెలియదు మనము వ్రాసిన యింగ్లీషు వాడకనచ్చదు. పోనీనీవుదిద్దవయ్యాదాన్ని నేను కాపీచేస్తానంటే—ఆపనివాడికి చేతకాదు. తాను స్వతంత్రింగా వ్రాయమంటె ఆపని అనలేచేతకాదు. వాడి మనస్సునకు నచ్చునట్లుగా మనం వ్రాయాలిట! అదెలాగో చెప్పు.'

'ఔదుమూ—నాప్రాణంనిండా విసిగిపోయింది. అందుకునే డిస్పాచివర్కుదా చేస్తూ కూసుకుందాను. ఏపనిచేస్తే యేమివుండాది? ఎట్లాగయినా గుమాస్తాగాళ్ళమే! మనజీవితం దుర్లమనకువస్తే అంతే చాలు.'

'అయితే మనముకూడా ఆఫీసర్లు కావడంఎప్పుడంటావు?'

'బండలూ! నేనుచెప్తాసూడు! 'అకౌంటుటెస్టు' మొండాదే అది మనము ప్యాసుకావాలి.'

'అయితే నాకన్నా సీనియరువికదా? నువ్వెందుకట్టి ప్యాసు కాకూడదు?'

'ఏమిటూ— వెళ్ళేవాండుగా — మొదలియార్ అని వూరుకుంటివా? యేమి? మనముదాటెట్టును మూడుసార్లుదాపోయి వుండాము. మూడుసార్లుకూడా ఢోకాతినవచ్చినవాము.'

'పోనీ యింకోమారు ఎందుకు వెళ్ళకూడదు? గజనీమహమ్మదు దండయాత్రలులాగ ప్యాసయ్యేదాకా ఎందుకు పోకూడదు?'

"నీవునింకా వెళ్ళినావంటవుదా? మార్వాము వుండేదే ఎన్నిమార్లు పోయినా లెక్కవుండేదికాదు. ఇప్పుడుదా మూడుతడవలకన్న ఎక్కువదా పరీక్షకుకూరోన్వనిచ్చేదిలేదు."

"ఓహో! అలాగుంటదయ్యా! యిప్పుడు మనఆఫీసరు పదోఛాన్సులో టెస్టుప్యాసయ్యాడని విన్నాను నిజమేనా?"

"అవును. సత్యముదా. అందులో అబద్ధములేదు. నేనుముందుగాలచెప్పివుకిస్తేనే."

'అయితే నీకు యింకఛాన్సులు లేవన్నమాట.'

"యిప్పటిమటుక్కు అంతదానే. ఈమధ్య టెస్టుప్యాసయిన వాండ్లు నిండాకావల్సివున్నారని, మాబోటివాండ్లకు యింకాఛాన్సులు యిస్తారని విన్నాను. అట్లాయిచ్చివుడిస్తే పోయికూసుకుని నాఅదృష్టం చూడవలెనుదా.'

"బాగుంది. అలాగేచెయ్యండి. అదృష్టంఎప్పటికి తిరుగుతుందో! ఎవరుచెప్పగలరు? లేవండి యింటికిపోదాం."

అంటూ యీయిద్దరువ్యక్తులు ఆఫీసులోనుంచిలేచి చరచరా వీధిలోనికి వచ్చేశారు. ఈయిద్దరిసంభాషణలనుబట్టి అందులో ఒకడు అరవదేశస్థుడనిన్నీ, రెండవవాడు ఆంధ్రుడని పాఠకులు ఈపాటికి ఊహింపకపోరు. వీళ్ళిద్దరూ డి. పి. డబ్లీయు. లో అకౌంటెంట్ ఆఫీ

సులో గుమాస్తాలు. అరవఆయనపేరు రంగనాథం. తెలుగుఆయన పేరు నారాయణరావు. రంగనాథం మొదలియార్ కులస్థుడు. నారాయణమూర్తి బ్రాహ్మడు. వీళ్ళిద్దరకు యెక్కువస్నేహం. ఎందుకంటే ఆఫీసులో ఒకేచోట గుమాస్తాలుగనుక. రంగనాథం ఓల్డుమెట్రిక్యు లేటు. నారాయణరావు యింటర్మీడియట్ సగముచదువుతూ డబ్బు లేక మానుకున్నాడు. నేను ఓల్డుమెట్రిక్యులేటునని, తనకుయింగ్లీషు భాషాజ్ఞానం—పునాదికట్టుదిట్టము ఎక్కువని రంగనాథమునకు — తాను యింటర్మీడియేటనీ, కొంచెంయించుమించుగా బి. ఏ. తో సమానమనీ, అందుచేత మొదలియార్ గారికన్న ఎక్కువచదువుకున్నానని నారాయణరావుగారికి మనస్సులోవుంది.

---

౨

రంగనాథం ఆఫీసులోకూర్చొని మామూలుప్రకారం ఉత్తరాలు డిస్పాచిచేస్తున్నాడు. ఆఫీసరు శ్రీనివాసఅయ్యంగారు యిలాపిలిచాడు.

'రంగనాథం''

''సార్'

'యిట్లారాండి'

'చిత్తం. చిత్తం వస్తున్నానండి.''

శ్రీనివాస:—ఇదిగో! యిటుచూడండి. మీకు అకౌంటుటెస్టు యిదివరలో మూడుమార్లు పోయిందికదా!

రంగ:—ఆవునండి సార్!

శ్రీనివాస:—అయితే నీకు యింకోమాటు ఛాన్సుయిస్తే వెళ్ళాలనివుందా?

రంగ:—ఎందుకువుండదు? అది సాధ్యమవునా!

శ్రీనివాస:—సాధ్యము నేనుచేస్తునప్పా! నీవునిండా పిల్లలుకల వాడివని వింటిని. ఏదోప్యాసుఅయితే పైకిపోతావు. లేకుంటే యిట్లవానే అవస్త పడవలెను.

రంగ:—(చేతులుజోడించి) నమస్కారంసార్! నిండా నమస్కారం! మీరుదా పార్ధసారథి పెరుమాళ్ళవలె వుండారు. తమరు నన్ను శిఫార్సుచేసి వుడుస్తురా?

శ్రీని:—ఆమ అకౌంటెంట్ జనరల్‌నుంచి, యిదివరలో పరీక్ష మూడుమార్లు పోయినప్పటికి, కొంత తెలివైనవాడని, డ్రాఫ్టులుబాగా వ్రాస్తాడని, పనిచక్కగా చేస్తాడని, మీకు అభిప్రాయం వున్నవాళ్ళను ఏరి వాళ్ళపేర్లను మాకు పంపవలసినదని ఈదినం "సర్క్యులర్" వచ్చింది. అందుచేత ఏదోమీరు పెద్దవాంస్లుదా అందుచేత రికమెండు చేయవలెనని వున్నది.

రంగ:—నిండాసంతోషంసార్! ఈమాటు కష్టపడిచదువుతా. ఈమాటు ప్యాసుకావడంలేకపోతే శ్రీనివాసులుకొండకు తప్పకపోయి మొట్టకొట్టుకు వస్తునుసార్.

శ్రీనివాస:—అయితే నిన్ను రికమెండుచేస్తున్నాను. బాగాచదువవలెను. అవునుగాని బజారులో మిరేపకాయలు ఎట్లావున్నాయిధర!

రంగ:—రూపాయకు రెండుశేర్లుదా నేను రెండుదినాలకిత్రింద తెచ్చివుడిస్తిని?

శ్రీనివాస:—చింతపండు?

రంగ:—పీశ పదెండుఅణాలుదా యిచ్చి ఎత్తివస్తిని తమకు కావాలాఏమి సార్!

శ్రీనివాస:—సరుకు బాగున్నదా?

రంగ:—బాగానేవుండిసార్! నాలుగుకొట్లు తిరగవలె. అంగడిలో విచారించవలె. అంతదా. తమకు ఎంతపట్టును?

శ్రీనివాస:—ఇదిగో. పదిరూపాయలనోటు రెండురూపాయల మిరెపకాయలు, రెండువీశల చింతపండు మంచివి మార్కెటికి పట్టించుకురాండి.

రంగ:—చిత్తం. చిత్తం, నిండానంతోషం. తమకు నచ్చినవనుకు తెస్తాను.

శ్రీనివాస—అందుకనే మిమ్మల్ని కోరుతూంట

రంగ:—అయ్యో! తప్పేమిటండి? మీరు ఆఫీసర్లు, మేము గుమాస్తాలం అంతపాటిసేవ చెయ్యలేమా?

---

# 3

రంగనాథం ఒకరోజురాత్రి మంచముమీద పరుండి గుండెల మీద పుస్తకము పెట్టుకుని తీవ్రంగా ఆలోచిస్తున్నాడు అతనిభార్య తాయారు దగ్గరకొచ్చి నిలబడి!

భార్య:—ఇదుగో!

రంగ:—... ... ...

భార్య:—'మిమ్మలినే!

రంగ:—(ఉలిక్కిపడిలేచి) ఆ. ఆ ఏమి వచ్చింది? చెప్పు

తాయారు:—ఇదేనా? మీచదువు! బాగాచదువుతున్నారు లెండి పరీక్షకు.

రంగ:—లేదు—లేక——చదువుతూవుండానే చూడు. చదువుతూవుండగా ఒకపాయింటు వచ్చింది. అదిఏలాగు నిర్ణయించాలా? అని యోచనచేస్తూ వుండాను.

తాయా:—అయితే ఈమాటు తప్పకుండా ప్యాసవుతారన్నమాట

రంగ:—ఊతడవు తప్పకుండా ప్యాసు అవవలెను. చూడు రంగనాథ మొదలియార్ ఆఫీసరు అయి కూసుకుండవలె. గ్రహచారము సరిగ లేక అట్లాగా వుండిపోయినిమి—నేను! యిప్పుడు ఆఫీసర్ పనిచేస్తూ వుండేవాళ్ళంతా నాకన్న ఎన్నో సంవత్సరాలు జూనియర్ వాండువ్వా నేనుదా రొంబా సీనియర్.

తాయా:—అయితే యేమిలాభం? వాళ్ళకింద మీరు కట్టలు మోస్తూవున్నారా లేదా? ఫైళ్ళదుమ్ములు దులుపుతూవున్నారా లేరా?

రంగ:—అవునమ్మి—ఖర్మఅల్లావుండాది. నీవుఎందుకు వస్తివి? ఇప్పుడు.

తాయా:—సాపాటుకు (భోజనానికి) లేవరా యేమిటి? భోజనము చేసి నెమ్మదిగా చదువుకోండి.

రంగ:—అవును. భోజనముచేయ లేదే! మరచిపోయివుండాను! తాయి! యిటుచూడు. భోజనమొచేసి వుడుస్తునా? వెంటనేతూకం (నిద్ర) వచ్చునే? అప్పుడుచదువుట నిండాకష్టంగావుండును.

తాయా:—నేనుచెప్ప లేదా? మొదలేచెప్పాను. పెద్దవయస్సు వచ్చాక పరీక్షలు ప్యాసుకావటంకష్టం. యివన్నీ మీరు చిన్నతనం లోనేప్యాసుఅయివుండవలసింది. వేళ్ళుముదిరినకొద్దీ చదువు వంటపడు తుందా?

రంగ:—అవునుదా. నీవుచెప్పేది సత్యముకానీ యేమిచేయువలె యిప్పుడు.

అని రంగనాథం భోజనానికి లేచాడు. భోజనముదగ్గరకూర్చొని భోజనముచేస్తూవున్నాడన్నమాటేగాని రంగనాథందృష్టిఅంతా పరీక్ష మీదనేవున్నది. అంటే బాగాచదువుదామని కాదు. ఏలాగు ఈపరీక్ష ప్యాసుకావడమనే అతనిఆలోచన. ఆతడుభుజిస్తున్నాడు. తాయారమ్మ వడ్డిస్తున్నది. యివన్నీ ఆటోమేటిక్‌గా జరిగిపోతున్నవి.

అతడు ఈదఫా ఒకటిచెయ్య నిశ్చయించుకున్నాడు. పరీక్షలకు కూర్చున్నవాళ్ళంతా న్యాయంగావ్రాసి పేసయ్యారన్నదికల్ల. అందులో డిపార్టుమెంటరీటెస్టులు అసలేబోగసు. కనుక తాను పరీక్ష వ్రాయడంతోటే వెంటనే చెన్నపట్నం వెళ్ళటం అక్కడ ఏపేపర్లు ఎవరెవరు దిద్దుతారో కనుక్కోవటం — అలాగు కనుక్కొని వాళ్ళకు దగ్గరబంధువుగాని — స్నేహితులుగానివున్న వాళ్ళయింటికివెళ్ళి వాళ్ల ద్వారా—లంచమిచ్చో—చాకరీచేసో నమస్కారాలుయిచ్చో ఏలాగో సిఫార్సుచేయించుకుని కార్యంసాధించుకోవాలని నిశ్చయించుకున్నాడు.

కానీ— ఒక్క విషయముంది. పరీక్షఅవడంతోనే మద్రాసుపోవటానికి— ఈవ్యవహారాలన్నీ చక్క పెట్టుకోవడానికి శలవు ఎక్కడనుంచి వస్తుంది? లేకేమి? శలవు అతనికి నిండుజీతంమీద చాలావున్నది. కానీ శలవుకు దరఖాస్తు పెట్టడంలో వెంటనే మంజూరు కావద్దూ? ఫరవా లేదు. శ్రీనివాసయ్యంగారికి తాను చాకిరీచేస్తాడు. అందుచేత అడగ్గానే ఆయన యివ్వవచ్చు. అధవా—అల్లా యివ్వకపోతే—వంట్లో జబ్బుగావుందని రెండునెలలు మెడికల్ సర్టిఫికిట్ మీద శలవుతీసుకోవటం, ఈప్రకారంగా రంగనాధం తనముందువిషయాన్ని గురించి ఆలోచించుకుంటూ నెమ్మదిగా భోజనముముగించి తాంబూలం వేసుకుంటున్నాడు.

వీధిలో:—

'మొదలియార్ గారూ!'

మొద:—యారది? (ఎవరువారు?)

బయటనుంచి:—

'నేను నారాయణరావుని'

రంగనాధం వీధిలోకొచ్చి తలుపుతీశాడు.

రంగ:—ఏమియా? యింతరాత్రివేళదా వస్తివిఖ్యాయింటికి ఏమి విశేషము.

నారా:—ఏమీ లేదు. యిప్పటిదాకా ఆఫీసరుగారి యింటివద్ద వున్నాను. కాగితాలు సంతకాలు పెట్టిస్తూవున్నాను. యింతరాత్రి దాకా సంతకాలు పెట్టలేదు.

రంగ:—వడ్డించినట్లుగానేవుంది అయితే యిప్పుడు ఎందుకువస్త?

నారా:— ఏమీ లేదు. యివి రేపుపొద్దుటే ఆఫీసుకుపోయి వెంటనే డిస్పాచీ చేయునలెను.

రంగ:—ఓహో! అందుకునా? యిప్పుడునస్తిరి ఏమితొందర.

నారా:—తొందరేంబాబూ! ఏమిఆఫీసర్లో! ఏమివ్యవహారాలో—రాత్రి పగలూ ఒకటేచాకిరి. పరీక్షకు బాగాచదువుతున్నారా?

రంగ:— చదువుతుండాను. పిరుమాళ్ళ కరుణావా వుండవలె. ఆకాగితాలు యిట్లా తేండి. యింక వేగిరంపోయి భోజనంచేసి పండుకోండిమి. పదిగంటలు దాటిపోయింది.

నారా:—ఆలాగే——వెడుతున్నాను.

---

## ४

రంగనాథమునకు పరీక్ష దగ్గరకొచ్చినకొద్దీ ఆదుర్దా ఎక్కువ కావడం మొదలుపెట్టినది ఆదుర్దాఎందుకని అడుగుతారా? అది అతడి జీవితాన్ని నిర్ణయిస్తుంది. యిదివరలో మూడుతడవలు పరీక్షకు కూర్చుని తప్పినాడు. అందుచేత అతడికిందజూనియర్ లందరు పరీక్షప్యాసు కావటంచేత పైకిపోయి, అకౌంటెంటులు అయ్యా, ఆఫీసర్లుఅయ్యి మంచి హోదాలోవున్నారు కానీ తానుమాత్రం అట్లాగేవున్నాడు.

అనేకమంది కుర్రవాళ్లు మొదలియార్ గారివద్ద పనినేర్చుకుని ఆయనచెప్పిన పనులన్నీచేస్తూ ఆయన కళ్ళముందరే పరీక్షప్యాసై ఆ పనమీద ఆఫీసరుగావచ్చేరు. అయితే ఈయన వాళ్ళను లెక్కచేసే

వాడుకాదనుకోండి. వాళ్లలోచాలామంది మంచివాళ్లుగనుక ఈయన్ని అమర్యాద పరచేవారుకాదు. కానీ ఆకుర్రకారులోకూడా ఒకొక్క రాలుగాయి లాంటివాడు వున్నాడంటే "మిష్టర్ రంగనాథం' అని 'రంగనాథం, ఫైలుపట్టుకురా ... యిక్కడయిది ఎందుకుతప్పురాశావు? ఇన్నాళ్ళనుంచి సర్వీసుచేస్తూవున్నా నీవునేర్చుకున్న పనియిదేనా? నాన్ సెన్సు. నిన్ను యింకోచోటికి బదలీచేస్తా' అని అనేటప్పటికల్లా అతడివళ్ళు చివుక్కుమంటూవుండేది. గుమాస్తాఉద్యోగము చేయడము కష్టమేననీ, అందులో ఎల్లకాలము—వయస్సు వచ్చేకకూడా గుమస్తాగా పనివుండటము మరీకష్టమని అతడు స్వానుభవంవల్ల తెలుసుకున్నాడు.

పాపం! యింట్లోవున్నవన్నీ ఆడవాళ్ళకు ఏమితెలుస్తాయి? 'ఏదో మాఆయన ఉద్యోగం చేస్తున్నాడని ఆడవాళ్లు ఉపలాటపడడం, 'మా నాన్నగారు ఆఫీసుకుపోయివస్తున్నారు. అనిపిల్లలు చిందులుతొక్కటం తప్ప! చిన్నతనంలో గుమాస్తాగిరి కష్టమనిపించదుగాని, వయస్సు ముదిరినతరువాత దానంత కష్టమైనవృత్తి మరోటి కనుపించదు.

ఈకారణాలచేత రంగనాథం పరీక్ష వారంరోజులు ముందుందనగానే నెలరోజులు శలవుపెట్టేడు. మొదటి వారమురోజులు పరీక్షకు జాగ్రత్తగా చదువుకోనటానికి, తతిమానెలరోజులు మద్రాసులోనేవుండి పరీక్షపేపర్లు ఎవరుదిద్దుతున్నారో కనుక్కుని, నాలుగురాళ్ళు తినేవాడుంటే అందిచ్చో, సప్లయిలు కావలసినవాడికి, పండూఫలమూపంపో, లేక పూరికే పరువుకి ప్రాకులాడేవాడుంటే వాడియింటిచుట్టూ పది మాట్లుతిక్కిగ్గి యిరవై జోహారులుకొట్టో—ఏలాగో ఒకలాగు మెట్టుమీద గట్టుఎక్కుదామని వున్నది అతనివూహ.

శ్రీనివాస అయ్యంగారుయింటిలో చాకరీచేయుటవల్ల అమ్మగారు మొదలియార్‌గారికి శెలవుసిఫార్సుచేసింది. వెంటనే అయ్యగారు మంజూరుచేశారు. రంగనాథంగారికి శలవుదొరికింది. వారమురోజులు యింటివద్దచదివి పరీక్షకు చెన్నపట్టణం వెళ్ళేరు రంగనాథంగారు.

రంగనాథం మద్రాసు వెళ్ళి కేమాత్రం అతనికి లోటు ఏముంటి? మద్రాసు అతడు పుట్టినవూరే ఆయను. చిన్నప్పటినుంచి పెరిగి అక్కడ చదువుకొన్నవాడే ఆయను. అతడి చెల్లెలిమొగడు అక్కడ కకొట రీయేటులో పనిచేస్తున్నాడు. అందుచేత వెళ్ళగానే చెల్లెలిగారియింట్లో బసచేసినాడు. ఆమరునాడు, మూడవనాడు పరీక్షకుపోయి తనకుచేత నైనది వ్రాశాడు.

పరీక్ష అయిపోయిన అనంతరం, వెంటనే పార్థసారథి స్వామి వారిగుడికివెళ్ళి అక్కడ గుడికి ఎదురుగుండావున్న కోనేట్లో కాళ్ళు, చేతులు కడుక్కొని, టెంకాయ, అరటిపండ్లు, మొదలైన వస్తువులు కొనుక్కొని, స్వామివారి ఆలయంచుట్టూ ముమ్మారు శ్రద్ధా భక్తులతో ప్రదక్షిణచేసి, పార్థసారథిస్వామిఎదుట చెంపలు పగిలేటట్లు యిరవై లెంపకాయలు వేసుకొని, పండ్లు పూజారికిచ్చి, దక్షిణం సమ ర్పించి, ముప్పైకి తక్కువ లేకుండా, చెవులు చేత్తోపట్టుకు గుంజీలు తీసి, స్వామివారిఎదుట సాష్టాంగపడి, రెండుచేతులూజోడించి ఏలాగో ఒకలాగ తనపరీక్ష ప్యాసుచేయుమని ప్రార్థించాడు.

తరువాత యింటికివచ్చి యికయేయేపేపర్లు ఎవరుదిద్దుతారో వాళ్ళని కాళ్ళని పట్టుకు తంటాలుపడి తెలుసుకున్నాడు. మొదటిపేపరు యింగ్లీషు డ్రాప్టు కాంపోజిషన్. ఆపేపరు పరసువాకంలో ఒకరిటైర్డు ఉద్యోగి దిద్దుతున్నట్లు తెలుసుకున్నాడు. ఆయనపేరు, ఊరు, యింటి నెంబరు, వీధిపేరు, అన్నీ భోగట్టా చేసుకున్నాడు. ఆయనకు దగ్గరబం ధువు ఎవరా? అని ఆలోచనచేశాడు. ఈయనకూడా మొదలియార్ కులస్తుడే. అన్న పిళ్లెవీధిలో రిటైర్డు పోస్టుమేష్టరు అరుణాచలం మొదలి యారుగారి తమ్ముడని తెలిసింది అరుణాచలమొదలియారుగారిని తనకు తెలుసు. కనుక అరుణాచల మొదలియారుగారియింటికెళ్ళి ఆయనను సవినయంగా నమస్కారంచేసి తనతమ్ముడిగారికి తన్ను గూర్చి సిఫార్సుఉత్తరంయిమ్మని అడిగాడు.

ఉత్తరము అక్కర లేదని, తాను చెప్పినట్లు చెప్తే తన తమ్ముడు తప్పకుండా వింటడని ఆయన చెప్పేడు. కానీ రంగనాథం ఆయన్ను వదలలేదు. జలగ పట్టుకున్నట్లు పట్టుకు ప్రాధేయపడటం మొదలు పెట్టేడు. ఆయనకు జాలివేసి ఇతగాడు తమకు బంధుకోటిలోవాడ నన్నీ ఏలాగో పైకి లేవనెత్తవలెననన్నీ సిఫారస్సు ఉత్తరం వ్రాసి ఇచ్చేడు. దానికి రంగనాథం ఎంతో కృతజ్ఞత చూపుతూ, పదిమాట్లు సలాములు చేసి పరశువాకం వేపు వారితీశాడు.

పరశువాకంలో రిటైర్డు ఉద్యోగి ద్వారకణ్ణు మొదలియార్ గారియిల్లు కనుక్కున్నాడు. కాని నేరుగాపోయి ఆయన్ని చూడటానికి భయం. సాధారణంగా మామూలుగా మనిషిలాగు వెళితే భయమెందుకు చెప్పండి కానియితడు ఆలాగు వెడుతున్నాడా? లేదే! తీరా ఆయన అల్లరిచేస్తే కొంపమునిగిపోతుంది. ఉద్యోగానికే మోసము వస్తుందే?—అందుచేత నెమ్మదిగా ఆయన వీధిగుమ్మమువద్ద నిలబడి—

'సార్' అని పిలిచాడు.

లోపలినుంచి:—"ఏరది?" (ఎవరు వారు?)

'సార్!'

లోపలినుంచి:—ఎవరది? అని ద్వారకణ్ణు మొదలియారుగారే స్వయంగా వచ్చేరు. ఆయన చాలా సింపిల్‌గా వున్నారు. పంచమాత్రము కట్టుకుని బనియనుతొడుక్కుని రంగు పెనసలు చేత్తో పట్టుకు కళ్లద్దాలు సవరించుకుంటూ వచ్చి—

'ఎవరండీ? ఊరారు? లోపలికి దయచేయండి' అని లోపలికి తీసుకుపోయి ఆయన ఆఫీసు గదిలో కుర్చీమీద కూర్చోమన్నారు.

రంగనాథం కొంచంసేపు మౌనంగా వున్నాడు. ద్వారకణ్ణు గారుకూడా కొంచముసేపు మౌనముగానేయుండి పేపర్లు చూస్తున్నారు. రంగనాథం తన జేబులోవున్న కవరువుత్తరం తీసి ఆయన బల్లమీద పెట్టేడు. ద్వారకణ్ణుగారు ఇతడేదో ఉపకారంకోసం వచ్చినవాడేనని

వెంటనే గ్రహించాడు తరువాత ఆయన ఆవృత్తరం సాంతంగా చదువు కుని బుజ్జిపూపులుని 'సరేలెనిడి యిక మీరు వెళ్ళండి' అన్నాడు.

రంగ:—ఆలా కాదు. తమరు నాకు వాగ్దానం యివ్వాలి.

దొర:—బాగావున్నది లెండి. యిలాటివిషయాలలో మీరు నాదగ్గరకు రాకూడదనీ అందులోను బంధువులవద్దనుంచి, స్నేహితుల వద్దనుంచి వుత్తరాలు అసలే తేకూడదన్నసంగతి మీకు తెలియదా?

రంగ: —(మాట్లాడలేదు.)

దొర:—ఏమండీ? మాట్లాడరు. యిలాటివిషయాలలో మీ ఉద్యోగానికే భంగంవస్తుందన్నసంగతి మీకు తెలుసునా? తెలియదా?

రంగ:—చిత్తం. చిత్తం. తెలుసునండి. తమరుబంధుకోటిలోని వారని, సాక్షాత్తు శ్రీరామచంద్రులవంటివారని, నమ్మినవారిని నాశ నముచేయరని, తమ ఆస్రితులకు ఉపకారంచేస్తారని వచ్చేను. పిల్లల గలవాడిని, యిరవైసంవత్సరాలసర్వీసు. తమరుకరుణచూపాలి. కావల సినవాడినైననన్ను కాస్త తప్పైకె లాగితిరా? మీపేరుచెప్పుకుంటాము.

ధొర:—చాలాబాగావు దినాయనా? నాదగ్గరకువస్తే వచ్చేరు గాని, యికయిలాగ యింక ఎవరిదగ్గరకు వెళ్ళకండి. యిదిచాలా ప్రమాదమైన విషయము

రంగ:—చిత్తం. చిత్తం సాటికులస్థుణ్ణి, బీదవాణ్ణి, పిల్లలగల వాణ్ణి, తమరుకరుణించాలి.

దొర:—సరేవెళ్ళండి. ఈవిషయం ఎవరికీ వెల్లడిచెయ్యకండి. మీకు—నాకు—కూడా ప్రమాదకరమైన సంగతి.

రంగ:—చిత్తం. చిత్తం. నమస్కారమండి. అని సంతోష మైన ముఖంతో వెనక్కు—పోయాడు.

ఇక్కడ యింగ్లీషుశాస్త్రి, కాంపోజింగ్ పేపరుసంగతి బాధలేరి పోయింది. యింకాముఖ్యమైనపేపరు రెగ్యులేషనులు, రోడులు, మెజర్మెంటు వంటివి కలిగినపేపరులోకూడా జయమందాలి ఈపేపరుకూడా ఎవరు దిద్దుతారో రంగనాథం యింతకుముందే వాకబుచేసుకుని వున్నాడు. దీన్ని మదరాసుకు దగ్గరగావున్న కోడంబాకంలో చెన్నపట్నపు ఆఫీసులో పనిచేస్తూవున్న ఆరాముద అయ్యంగారు దిద్దుతారన్న సంగతి తెలిసింది.

ఇక ఆ ఆరాముదయ్యంగారి స్వభావమును గురించి వాకబు చేసుకున్నాడు ఆరాముదయ్యంగారు మంచివాడేనని, కానీ-ముక్కోపి అని ఎంతకోపదారివాడో అంత ఉపకారపరుడని, ఏదైనా మేతవేస్తే యిస్తే లొంగుబాటులోకొస్తాడని, ముఖ్యముగా అతడికి పొగడ్తకావాలనీ తెలుసుకున్నాడు.

మంచిరోజుచూసుకుని, రాహుకాలం లేకుండా వున్నసమయంలో బయలుదేరి బజారుకుపోయి, ఒకపనసపండు, ఒకబుట్ట బత్తాయిపళ్ళు, రెండుచక్రకేళీ గెలలుకొని, ఎలక్ట్రిక్ ట్రెయిన్ ఎక్కి కోడంబాకంవెళ్లి సామాను కూలివాడిచేత మోయించుకుని అతడియింటికివెళ్ళి వీధిలో వున్న బంట్రోతుకు నాలుగుఅణాలు చేతులోపెట్టి దర్శనంచేయించమని కోరాడు.

వెంటనే బంట్రోతు అయ్యంగారు స్నానంచేసి కాఫీపుచ్చుకుని సావిట్లో పడకకుర్చీలో కూర్చుని, వార్తాపత్రిక చదువుకుంటూవున్న సమయమందు 'యింటర్‌వ్యూకు' అరేంజిచేసినాడు. అయ్యంగారు పడకకుర్చీలో కూర్చున్నారు. రంగనాథంవెళ్ళి సవినయంగా నమస్కారంచేసి ఆయనకు ఎదుటనిలబడ్డాడు. ఆరాముదయ్యంగారు సవిలాసంగా నమస్కారంఅందుకుని ఎదురుగుండావున్న కుర్చీలో కూర్చోమన్నారు

రంగనాథంకూడా కూర్చున్నాడు. బంట్రోతు వెంటనే బత్తాయిపళ్ళు బుట్ట, అరటిపళ్ళ గెలలు, పనసపండు తెచ్చి సావిట్లోవుంచేడు. ఆరాము దయ్యంగారు తనకువచ్చినకానుకలను చూచాడుగాని పైకి చిట్లించు కొన్నట్లు కనపడినా లోలోపల ఆనందంగానే వున్నాడు.

రంగనాథం బహుయెరుకవ తెలిసినవాడు. వెంటనే గ్రహించి ఆసామానంతా యింట్లోఅమ్మగారివద్ద అప్పజెప్పమని సౌంజ్ఞచేశాడు. వెంటనే ఆవస్తువులు అక్కడనుంచి తొలగింపబడ్డాయి. అయ్యంగారి ముఖం వికసించింది. రంగనాథంవచ్చినపని నెరవేరేసూచనలు అప్పుడే కనపడ్డాయి.

ఆరాముద:—మీది ఏవూరు? ఎందుకువచ్చినారు?

రంగా:—చి/త్తం. చిత్తం. విశాఖపట్టణంలో వుంటున్నానండి. తమపేరు డిపార్టుమెంటులోవిన్నాను. మాఆఫీసరు శ్రీనివాసఅయ్యం గారు అస్తమాను తమయొక్క తెలివితేటలగురించి, తమఔదార్యము తమమంచిస్వభావము, తమరువారికి చేసినమేలునుగురించి సర్వదా చెప్పతూవుంటారండి.

ఆరా:—అవును. శ్రీనివాసను నాకు చాలాజూనియర్. మా వద్ద ఆఫీసులో చిల్లెరపనులుచేస్తూవుండేవాడు. కానీ మనిషిమంచి తెలివైనవాడు, చురుకైనవాడు, ఎంతపనైనా లక్ష్యంలేనివాడు.

రంగ:—చిత్తం. చిత్తం. చాలా తెలివైనవారండి. ప్రతీకాగితం స్వయంగా వారుచూచుకుంటేనేగాని సంతకాలు పెట్టరండి. ఫెయిరు కాపీలు యిచ్చినప్పుడుకూడా ఆఫీసుకాపీలు ఒకమాటు తెప్పించి చూచు కుంటేనేగాని సంతకాలు పెట్టరండి. కానీ ఎప్పుడూ తమపేరే తలుస్తూ వుంటారండి,

ఆరా:—అల్లాగా! అవునుగాని నీవువచ్చినపని?

రంగ:—ఏముందండి? చిత్తం. చిత్తం. తమరు ఎరుగర్ధుగనక నాండి. ఈసంవత్సరం నేను డిపార్టుమెంటరీటెస్టుకు కూర్చున్నానండి. యిదివరలో వ్రాలాఘాన్సులు అయిపోయినాయండి. ఇదినాకు స్పెషలు ఛాన్సు యిచ్చినారు. నాకు ఆసుగురుపిల్లలు. తమరు కరుణించాలి.

ఆరా:—ఓహో! అందుకటయ్యా! వచ్చావు! భేషు! బాగానే వుంది వీకలమీదకువచ్చే ఉపకారాలు చేయమంటారేమిటయ్యా? నీనెంబరెంత?

రంగ:—యిరవైరెండండి.

ఆరా:—ఒకకాగితముముక్కమీద రాసియియ్యి.

రంగ:—(కాగితముమీద వ్రాసియిస్తాడు.)

ఆరా:—సరేలే. యిందులో ప్యాసైతే లాభమేమిటి? మిగతా వాటిల్లో బాగా వ్రాశావా?

రంగ:—చిత్తం. చిత్తం. చాలాబాగా వ్రాశానండి. వాటిని గురించి నాకు భయములేదండి. తప్పకుండా ప్యాసవుతాను. ఈవిష యంలోమాత్రము తమరు పుణ్యంకట్టుకోవాలి.

ఆరా:—పరీక్ష ప్యాసయినాక—నువ్వుఆఫీసరైనాక మళ్లీ మాకు కనిపిస్తావా? మమ్మల్ని మరచిపోతావా?

రంగ:—చిత్తం. చిత్తం. ఎంతమాటఅన్నారు. ఎప్పుడైనా తమవిధేయుణ్ణి, తమచేతికింద పనిచేసేవాడిని, ఆఫీసరుకావడంతోటే

తమకు ఎంతసహాయం చేస్తాననుకున్నారు? అప్పుడే తెలుస్తుంది మీకు! యిప్పుడు బీదస్థితిలో వున్నాను. ఏంచెయ్యగలను? మంచికాలను వద నీయండి. వారానికి ఒకమాటువచ్చి తమదర్శనం చేసుకుంటాను.

ఆరా:—నరేలేవెళ్ళు. ఈవిషయం ఎవళ్ళకీ వెల్లడిచెయ్యకు. మాటవరుసని మా శ్రీనివాసంతోకూడా చెప్పకు. నీకూ, నాకూ కూడా ప్రమాదం.

రంగ:— చిత్తం. చిత్తం. నమస్కారం. నాకుశెలవు యిప్పించండి.

ఆరా:—యిక వెళ్ళండి.

రంగ:—చిత్తం. చిత్తం. నమస్కారములండి.

---

౭

రంగనాథమునకు వచ్చినపని అయినట్లే అనిపించింది. ఎందు కంటే ముఖ్యమైన రెండుపేపర్లలోను మార్కులు ఖచ్చితంగా పడిపో తాయి పడిపోవడమేమిటి? ప్యాసుచేస్తామనివాళ్లు మాటయిచ్చారు. అందుచేత విశేషమైన సంతోషంతో ఆపిల్ పళ్ళు, కేబేజీ, కేరట్ దుంపలు, పచ్చిద్రాక్షపళ్లు—యివన్నీపట్టుకు, బంధువులలో సెలవుచెప్పి రైలుఎక్కి విశాఖపట్టణంచేరుకున్నాడు.

ఆరాత్రి భోజనంచేసి పెళ్లాం బిడ్డలతో యిష్టాగోష్టిసలిపి మరు నాడుపొద్దుట శ్రీనివాసయ్యంగారు యింటికి తాను తెచ్చిన సామాను లతో వెళ్లాడు. అయ్యంగారు స్నానంచేసి నామాలుదిద్దుకొని వెండి గ్లాసుతో కాఫీత్రాగుతున్నారు. రంగనాథంపోయి 'నమస్కారంసార్!'

శ్రీని:—హల్లో! రంగనాథం! ఎప్పుడువచ్చేవు? కూర్చో.

రంగనాథంవెంట కూలివాడు తెచ్చిన సామాను చూచాడు. వెంటనే భార్యానుపిలచి వాటిని లోపలపెట్టమనిచెప్పి రంగనాథానికి కాఫీ పట్టుకొచ్చియిమ్మని ఆజ్ఞచేశాడు. శ్రీనివాసనుగారి భార్య వంటవాడిచేత రంగానాథానికి కాఫీపంపింది.

రంగ:—నాకెందుకు? సార్! కాఫీ నేను యింటివద్ద త్రాగే వచ్చేను.

శ్రీని:—అదికాదోయ్. నువ్వు యింట్లో త్రాగుతావన్నసంగతి నాకు తెలియదా? ఏమిటి! నేను యిచ్చినపుడు నువ్వు పుచ్చుకోవాలి.

రంగ:— చిత్తం. చిత్తం. (అని కాఫీతాగుతాడు)

శ్రీని:—ఏమిటి మద్రాస్సు విశేషాలు?

రంగ:—ఏమున్నాయండి అంతాబాగానే వుందండి.

శ్రీని:—అదికాదు—చీఫ్ యింజనీరు ఆఫీసువాళ్లు ఎవళ్ళైనాకన పడ్డారా?

రంగ:— చిత్తం. చిత్తం. కొంతమంది క్లార్కులునాబోటి వాళ్లే పరీక్షలకు కూర్చున్నారండి.

శ్రీ:—అవునుగాని — నీవుబాగావ్రాసినావా? ఏలాగువున్నాయి పేపర్లు?

రంగ—:చిత్తం చిత్తం బాగానేవ్రాశానండి. యింతకు భగవం తుడి దయవుండాలి తమరు ఆశీర్వదించాలి.

శ్రీని:— ఫరవాలేదులే. ప్యాసవుతావు. యింతకు ఎంతబాగా వ్రాసినా, అదృష్టంవుండాలి. డిపార్టుమెంటల్ టెస్టులన్నీ ఛాన్సుమీద ఆధారపడి వుంటాయి.

రంగ:— చిత్తం. చిత్తం

శ్రీని:—నీ శెలవు అయిపోయిందిగదా! ఆఫీసులో జాయిను అవు తావా? ఈ వేళ!

రంగ:— చిత్తం. చిత్తం.

రంగనాథంలేచి నుంచున్నాడు. శ్రీనివాసంగారు 'సరేవెళ్లు' ఆఫీసుకురా' అన్నారు.

ఆఫీసులో మామూలుగా రంగనాథం పనిచేసుకుంటున్నాడు. నారాయణరావు రంగనాధాన్ని పలకరించేడు. పరీక్షబాగా వ్రాశావా? లేదా? అని అడిగాడు. బాగానే వ్రాశా నన్నాడు. యిలాగ మామూలు

గానే ఆఫీసువ్యవహారాలు జరిగిపోతున్నాయి. ఇలాగ మూడునెలలు గడిచింది. ఆఫీసుటపారాగానే శ్రీనివాసఅయ్యంగారి బల్లమీదవుంచాలి. వచ్చిన ప్రతికవరల్లా ఆయనే స్వయంగాచించి, ఆకాగితాలు చదువు కుని అందిమీద ఆయనసంతకాలుచేసి తారీఖువేసి ఆఫీసులో గుమా స్తాలకు యివ్వటంవాడుక.

అలాగునే ఒకరోజున శ్రీనివాసయ్యంగారు ఆఫీసుటపా చూస్తు న్నారు. కవరులన్నీచింపి చదువుతున్నారు. ఒకకవరు చాలాబరువుగా వున్నది. ఏమిటిచెప్మా! యింతబరువుగా వున్నదనిచూస్తే అందులో యింకోకవరువున్నది. దానికి సీలుచేయబడివున్నది. ఆసీలువిప్పిచూస్తే అందులో అకౌంట్‌పరీక్ష ఫలితాలలిష్టు వున్నది. సగములిస్టు చదివే టప్పటికి మనరంగనాధమొదలియార్‌గారి పేపరుకూడావున్నది. వెంటనే అయ్యంగారు అతనిపేరు ఎర్రపెనిసిలుతో టిక్కుపెట్టి క్రిందగీటుగీసి—

'రంగనాథం!'

రంగ:—సార్!

శ్రీని:—కమాన్ మిస్టర్!

రంగ:—గుడ్‌మార్నింగుసార్!

శ్రీని:—యస్! వెరీగుడ్‌మార్నింగ్. సిడౌన్. రంగనాథానికి యిదంతా వింతగావున్నది. ఆఫీసరుతన్ని ఎప్పుడూఆఫీసులో తనప్రక్కను కూర్చోమనలేదు. యిదియేమిటి? చెప్మా! తన్ను తనప్రక్కన కూర్చో మంటున్నా డనుకున్నాడు. రంగనాథం కూర్చున్నాడు.

శ్రీని:—మిష్టర్! రంగనాథం—కాదు ఆఫీసర్ రంగనాథం— నీవు పరీక్షప్యాసైనావు. మాకు ట్రీపార్టీ ఎప్పుడు. ఇదిగోలిస్టు చూసుకో

(అన్ని లిస్టు ముందర పారవేశాడు.) రంగనాథం అలిస్టుచూసు కున్నాడు. తనపేరు అందులోవుంది. చాలాసంతోషించాడు. అతడి ఆనందానికి హద్దులేదు. అలిష్టులో ఆఖరిని, త్వరలో ఉప్యోసైనవాళ్ళం దరను అకౌంటెంట్ ఆఫీసర్లుగా క్రమక్రమంగా తీసుకోబడునని కూడా వున్నది.

శ్రీని:—ఎన్నప్పా! రంగనాధా! ఎప్పుడీ ఖుషీ?

రంగ:—రొంబా సంతోషంసార్.

శ్రీని:—'నేను చెప్పేనుకదా' ప్యాసవుతావని.

రంగ:—పెరుమాళ్ళకృప. మీయొక్క ఆశీర్వచనం సార్.

---

# ౮

ఒకరోజు రంగనాథం ఆఫీసులో పనిచేస్తూవుండగా శ్రీనివాసయ్యంగారు పిలచి, రంగనాథానికి ప్రమోషన్ వచ్చిందనీ, అతడిని అసిస్టెంట్ ఆఫీసరుగా ధవిళేశ్వరము వేసినారని వారంరోజులలో పోయి జాయినుకావాలని వున్నకాగితం చూపించాడు. రంగనాథానికి ఆకాగితం చూడటంతోనే లోలోపల చాలాసంతోషంగావుంది. వుండదుమరీ? ఎన్నాళ్ళనుంచో తాను ఆఫీసరుకావాలని కోరుతున్నాడాయన

రంగనాథం భార్యా తాయారమ్మకూడా అమితానందం పొందింది. తాయారమ్మ ఆఫీసరుభార్యా అవుతుంది. అనగా రాజుగారిభార్య రాణి అంతటిదికాదా, అన్నమాట! ఆవిడ మొగుడిచేతికింద అనేకమంది గుమాస్తాలు పనిచేస్తూవుంటారు. నిత్యం ఆవిడియింటికి అనేకమంది గుమాస్తాలు దొరగారి సంతకాలనిమిత్తం కాగితాలుపట్టుకు పడగాపులుకాసి వీధిలో కూర్చుంటారు. అనేకవిధములైన అరవచాకిరీలు చేయించుకో వచ్చును.

రంగనాథ మొదలియార్ ధవిళేశ్వరం వెళ్ళిపోతున్నాడని ఆఫీసులో ఆయనకు అల్పాహారవిందు యేర్పరుపబడింది. గుమస్తాలందరు తలకొక రూపాయిచందా వేసుకుచేశారా టీపార్టీ. పార్టీకాలమందు అనేకమైన ఉపన్యాసాలు జరిగాయి. రంగనాథంగారు, యింద్రుడని చంద్రుడని, ఆఫీసుకు ఆయన ముఖ్యాంగమని, సర్వవిధమైన పనులు ఆయనకు తెలుసుననీ, డిస్పాచివర్కు, డైరీయింగు, దుమ్ముదులపటం, ఆఫీసర్ల ఎదుట నక్కవినయాలను చూపటం, తైరుకొట్టటం, యిత్యాది

వకులలో ఆయన అగ్రగణ్యుడని, ఎవరికీతోచినట్లువారు గుమాస్తాలు తలకొకరు తలకొక అయిదునిమిషాలసేపు ఉపన్యాసాలు చేశారు.

ఆఉపన్యాసాలకు రంగనాథం ఉబ్బిపోయినాడు. తోడిమిత్రులు తనయందుచూపిన వాత్సల్యానికీ, ఆఫీసరు ముఖ్యంగా తనయందు చూపిన కరుణకు తాను విశేషమైన ఆనందాన్ని పొందుతున్నాడనినీ, గవర్నమెంటు సర్వీసులో కష్టపడి పనిచేసినవాడకి తగినప్రతిఫలం ఎప్పుడో ఒకప్పుడు కొంచెము ముందువెనుకలలో తప్పక లభ్యమౌతుం దనిచెప్పి అందరకు నమస్కారం చేశాడు.

రంగనాథము ఆఫీసులో శలవుతీసుకున్నతరువాత సామానంతా సర్దుకుని, రైలుకు ప్యాసుచేసుకుని, ధవళేశ్వరంలోవున్న ఒక స్నేహితుడికి తనకు కాపురముండటానికి యిల్లు చూడమని వుత్తరంవ్రాసి మంచి రోజు చూచుకుని, రాహుకాలం అడ్డురాకుండావచ్చి తన నూతనోద్యోగంలో, అధికార గౌరవంతోవచ్చి ప్రవేశించాడు.

---

రంగనాథం మొదలియార్ గారు ధవళేశ్వరంలో ఆఫీసులో ఠీవిగా కూర్చున్నాడు. నెత్తిమీద సీలింగ్ ఫేను తిరుగుతూవున్నది. ప్రక్కన టేబిల్ ఫేన్ సిద్ధంగావున్నది. తనబల్లమీద నాలుగైదు ట్రేలు కాగితాలతోటి ఫైళ్ళతోటి నిండివున్నది అతడికి ఎదురుగుండా కుర్చీలువున్నాయి. అతడిచేతిక్రింద ఆరుగురు గుమాస్తాలు పనిచేస్తు న్నారు. అతడిహోదా ఎకౌంటెంట్ ఆఫీసర్!

ఇతడిపనియేమిటంటే—గవర్నమెంటుతరఫున పబ్లికువర్క్సుశాఖ వారు బిల్డింగులు కడతారు. రోడ్లను వేస్తారు, మరమ్మత్తు చేస్తారు. ఇటువంటిపనులన్నీ కాంట్రాక్టర్లద్వారా కంట్రాక్టర్లుచేస్తారు. ఆపనులను అజ్మాయిషీ చేసుకుని అవిసరిగావున్నవని యింజనీరింగు శాఖవారు చెప్పటంతోటే అకౌంటెంటు ఆఫీసరుగారు ఆబిల్లును తనిఖీచేసి ఆడిట్ చేసి డబ్బుయిస్తారు. ఇదీ రంగనాథనుగారిపని. ఎంతహోదావో ఆలో చించండి. నిత్యం అతడిదర్శనార్థం అనేకమంది, కంట్రాక్టర్లు, యింజ నీరింగుశాఖకుచెందిన ఆఫీసర్లు వేచివుంటారు.

రంగనాథముతనకు పెద్దఉద్యోగం కావటంతో అందరకునేమా నులు పంపుతానని యిదివరలో చెప్పియున్నాడు. తాను మంచిప్రదేశ ములో పడ్డాడు. అందులో ముఖ్యముగా గోదావరిజిల్లా కంట్రాక్టరు లను క్రిందిఉద్యోగస్తులను పీడించి ఆరామదయ్యంగారికి, యింకామిగి లిన పెద్దఉద్యోగస్తులకు వారం వారం పండ్లు, నెయ్యి మొదలైన సమస్తవస్తువులు ప్యాకుచేసి పంపుతూవుండేవాడు. అదిగాక తనమీద తనిఖీకివచ్చే ప్రతిఉద్యోగస్తుడికి నల్లని లంచాలతోనింపి పారవేసేవాడు తనపై

ఆఫీసువార్లను నెలకొకమాటుపోయి చెన్నపట్నంలోనూ మాది కానుకలు సమర్పించినస్తూవుండేవాడు.

రంగనాథం ఈవిధంగా పైఉద్యోగస్థులకు సప్లయిలు గుప్పటం చేత, సంభావనలు సమర్పించడంచేత, అతడు యేదివ్రాసినా తప్పుపట్టే వారుకాదు. పైగా అతడు మంచిఆఫీసరని, తెలివైనవాడని, చురుకైన వాడని, ఎంతపనైనా సునాయాసంగా చేస్తాడని పేరుప్రతిష్టలు సంపాదించుకొన్నాడు.

ఇతడు యిదివరలో తిరుపతిపోయి స్వామివారిని దర్శించుకొని శ్రీనివాసులకు తనజుట్టు సమర్పిస్తానని మొక్కుకున్నాడు. తాను పరీక్షప్యాసైనాడు. ఉద్యోగంలో ప్రవేశించి ఆరుమాసాలైనది. కాని యింతవరకు తిరుపతి వెళ్ళలేదే! శ్రీనివాసులకు కోపంవచ్చునో యేమో! పోనీ యిదివరలో తిరుపతి వెడదామంటే ఉద్యోగంలోచేరడం తోటే వెడితే లాభంలేదు. ఎందుకనగా వెంటనే శలవుయివ్వరు. యిచ్చినా అక్కడవుంచరు వెంటనే యింకోచోటికి బదిలీచేస్తారు. అందుచేత తిరుపతి వెళ్ళటానికి వేరేశలవుపెట్టకుండా ఏఈష్టరుశల వులో, క్రిష్టమసొవచ్చినప్పుడు నాలుగైదురోజులలోవెళ్ళి యాత్ర ముగించుకుందామని రంగనాథముగారు ఆలోచిస్తున్నాడు. అతడు ధవ శేశ్వరమువచ్చిన ఆరునెలలకు ఈష్టరుశలవులు వచ్చినవి. దానికితోడు అతడు ఇక్కడప్రవేశించి ఆరునెలలు అయినదిగనుక తనస్థితి కొంచము స్థిరపడినది.

ఈష్టరుశలవులలో రంగనాథము తాయారమ్మపిల్లలు తిరుపతి వెళ్లేరు. వెంకటాచలపతి అతడికి క్రొత్తకాదు. అనేకసారులు శ్రీనివా సులు దర్శనంచేసుకున్నాడు. శ్రీనివాసులు అతడికి యిలవేల్పు.

మొక్కుకున్న కార్యం తప్పకుండా చేస్తాడు. కొండమీద దేవస్థానం సత్రములో బసచేసి కోనేరులోస్నానంచేసి మొట్టకొట్టించుకున్నాడు. (గుండు) తరువాత సకుటుంబంగా స్వామివారి ఆలయంలో ప్రవేశించి తనకు ఆయాసంవచ్చేవరకు గుంజీలుతీసి సాష్టాంగపడి సేవలుచేసుకుని యాత్ర యధాప్రకారం పూర్తిచేసుకుని కొంతసొమ్ము స్వామివారి హుండీలో వేసి యింటికివచ్చేరు.

రంగనాధముగారితోపాటు ఆయనభార్యా తాయారు, పిల్లలు కూడా గుళ్లుచేయించుకున్నారు. యిక దేవతాదర్శనం అయిందిగనుక అన్నిమొక్కులుతీరినాయిగనుక ఉద్యోగం లౌక్యంగాచేసి తనసొంత హుండీని నింపుకోవటమే మొదలియార్ గారి ఆశయం!

---

రంగనాథంగారు ఆఫీసులో కూర్చొని కాగితాలు చూసుకుంటున్నారు. అతడిదర్శనంకోసము యింతకి బొంతల రామన్న అనే కంట్రాక్టరువచ్చి వేచివున్నాడు. బంట్రోతు చీటీ తేవడముతోటే అతడు లోపలికి రావటానికి పర్మిషన యిచ్చినాడు. రామన్నవచ్చి సవినయంగా నమస్కారంచేశాడు రంగనాథము అతడినమస్కారమును అందుకుని ఎదురుగుండావున్నకుర్చీలో కూర్చోమన్నాడు అతడట్లా పదినిముషాల సేపు కూర్చున్నాడు. రంగనాథం అతడితో మాట్లాడలేదు. అతడు త్వరితంగా తనపనిముగించుకు వెడదామని వచ్చినవాడు.

రంగనాథం ఎంతసేపటికి మాట్లాడకపోవటం రామన్న గ్రహించాడు. రామన్న అట్టేచదువుకున్నవాడుకాదు. చదువులేకపోయినా లౌకికజ్ఞానము, వ్యవహారజ్ఞానము అతడికి విశేషంగావుంది. రామన్న తన్ను ఒకకంట చూడమని అడిగాడు. ఆమాట తనకు అర్థంకావటం లేదని రంగనాథం అన్నాడు. 'తమరొక్కమాటు క్రిందకుదయ చేయండి' అన్నాడు రామన్న. 'నాకిప్పుడు తీరుబడిలేదు. పనిఎక్కువగా వున్నది' అన్నాడురంగనాథం.

రంగనాథం యిలాగ అనటంతోనే రామన్న కళ్ళమ్మటనీళ్ళు గిర్రుమని తిరిగేయి. తిరగవుమరీ, చెప్పండి! పెద్దమనిషివచ్చికూర్చుంటే మాట్లాడకుండావుంటే ఎంతఅగౌరవంగావుంటుంది? యితడు డబ్బుఆశ కలవాడనీ, డబ్బు పుచ్చుకునేదీ లేనిదీ పైకిస్పష్టపరుచడనీన్నీ, అంతా లౌక్యంగా, అరవపద్ధతిని గోప్యంగా, కుంభకోణంలాగ సాగించుకోవా

లన్న ఫక్కీలో వాడని తనవాకబువల్ల. తన స్వానుభవంవల్ల తెలుసుకున్నాడు రామన్న.

యితడు ముప్ఫై వేలకు ఒకచోట గవర్నమెంటు బిల్డింగు నప్పుకున్నాడు. పనిసగము పూర్తి అయింది. అయినమట్టుకు డబ్బు యివ్వవచ్చుననిన్నీ, చేసిన మట్టుకుపని సంతృప్తికరంగా వున్నదనిన్నీ, యింజనీరు శాఖవారు సర్టిఫికట్ యిచ్చివున్నారు దాన్ని ఆధారంచేసుకుని ఆఎస్టిమేట్ తనిఖీ చేసి డబ్బు యివ్వటానికి ఆర్డరువెయ్యటమే రంగనాధ మొదలియార్ గారి పని.

కానీ యీపని రంగనాధంగారు చేస్తారా? చెయ్యడు. ఎందుకు చేస్తాడు? తనముందు తనకు చెల్లిస్తేనేతప్ప చేయడు. అదిముందుగా చెల్లించవలె. దానికి నూటికి యింతని స్కేలువున్నది. ఆప్రకారం ఆ సొమ్ము రెండోకంటివాడు ఎరక్కుండా చెల్లించినట్లైతేనే దానిని అతడు భద్రపరచుకున్నాకే పేఆర్డరు వేస్తాడు. అవునుమరి ఎవడిలాభం వాడిది ఈకాస్తంతఆర్డరు వెయ్యడంతోటే తిరిగి మళ్ళీకనిపిస్తాడా? రామన్న! అధవా, కనిపించాడనుకోండి. 'అప్పుడు నీబిల్లు ప్యాసుచేసినాను. నా మామూలుమాట, ఏమిచెప్పావు?' అని మొదలియారుగారంత ఘరానామనిషి, పెద్దఆఫీసరుపోయి అడుగుతాడుటండి? కనుక ఆమెలుకువలు ఆకంట్రాక్టర్లే తెలుసుకుని వెంకటేశ్వరస్వామివారి హుండీపెట్టెలో సొమ్ము వేసినట్లు ముందుగానే చెల్లించి తరువాత తక్కుంగల కార్యక్రమానికి దిగాలి.

రామన్న ఒకరోజు సాయంత్రం అనగా ఏడుగంటలుదాటాక రంగనాధంగారి యింటికివెళ్ళేడు. రంగనాధముగారు న్యూసుపేపరు చదువుకుంటున్నాడు. రామన్ననుచాలాగౌరవంచేసి కూర్చోబెట్టుకున్నాడు. రామన్న దానికి పొంగిపోయినాడు.

రామ:—అయ్యా! మా బిల్లుమాట ఏమిచెప్పారు?

రంగ:—రెండురోజులే కాదుటండీ నావద్దకువస్తే నెమ్మదిమీద చెక్కుచేసి ప్యాసుచేసి పేఆర్డరు వేస్తాము.

రామ:—అయ్యా, బాబయ్యా బాబు, అంతవరకు ఆగగలుగు దునటండీ, కూలీలు పేమెంటుకోసము చంపేస్తున్నారు.

రంగ:—మీకు లోటుఏమిటండి. గొప్ప కంట్రాక్టర్లు ఆపైన యిదెంతబిల్లు బహుస్వల్పం! ఆ లాటి చిల్లరబిల్లులతో మీకులెక్క యేమిటి?

రామ:—అల్లాగంటా రేమిటి ప్రభువులు! ఆఫీసర్లు. పదిచోట్లపది బిల్లు లుండిపోయాయంటే నాపని కిచకిచలాడిపోతుంది. కనుక తమరు త్వరగా ప్యాసుచేయాలి. (అని ఒకవంద రూపాయల కాగితం అతడికి అందించాడు)

రంగ:—ఇది ఏలెక్కను యిచ్చినట్లు? యింతస్వల్పమొత్తం నేను తీసుకోను. బిల్లు ఎంతో తెలుసునా?

రామ:—ఎంతండిబాబూ ముప్పైవేలే గదుటండీ?

రంగ:—నూటికి ఎంతయిస్తూవున్నట్లుమీరు? అధమం నూటికి మూడురూపాయలేనా లేకపోతే యేలాగు. యింకా యిదితక్కువే. నేనుగుమాస్తాగా పనిచేసినరోజుల్లో మాఆఫీసర్లకు నూటికి అయిదు రూపాయలచొప్పున ముట్టేది.

రామ:—ఆరోజులు వేరండి. ఆకమాయిషు వేరండి. ఆకథ వేరండి ఇప్పుడాట్టే లాభాలుండటం లేదండి కంట్రాక్టులలో.

రంగ:—నూటికి రెండుచొప్పునేనాయిస్తేగాని నేనువుచ్చుకోను. కనుక ఆలెక్కప్రకారం యివ్వాలి. అదీగాక యిందులో కొంత మాగుమాస్తాలకు బంట్రోతులకి యివ్వాలి; లేకపోతే వాళ్ళు అల్లరి చేస్తారు.

రామ:—నాకు తెలియునంటూ గాండి ఈసంగతులు. అనేకసంవత్సరాలనుంచి నేను ఈకంట్రాక్టుపనులు చేస్తున్నాను.

రంగ:—అయితే—అన్నీ తెలిసివుండి మీరు యిలాగ తగ్గించటం చాలాపొరబాటు. అదీగాక యికముందు మీకువచ్చే మామూళ్ళు రూపాయలనోట్లలో యివ్వవద్దు యిప్పుడు రోజులు బాగుండుటలేదు. ఇందులో కొంతమేము మాపై ఆఫీసర్లయిన చెన్నపట్టణపువాళ్ళకు యివ్వాలి.. నేమానులు పంపాలి. కనుక దానివిలువ కాసులుకొని పట్టుకువస్తూవుండండి కనుక యిదీసంగతి.

రామ:—అదికాదండి. మీరు బిల్లు ఎంతకుప్యాసుచేస్తారో! అందులో ఎంతమొత్తం వోస్తాదో!

రంగ:—నీకు యేమీభయంలేదు. పూరాగా ప్యాసుచేస్తా. అది నాచేతిలోపని. కనుక దానివిషయమై నీవు బెంగపెట్టుకోవద్దు.

రామ:—చిత్తం. చిత్తం. రేపుకాసులుకొని పట్టుకొస్తానండి. పే ఆర్డరుమాత్రంవేసి చెక్కుయిప్పించండి నాకుశలవు. నమస్కారమండి.

రంగ:—మంచిది.

ఈవిధంగా రంగనాథము ఒకసంవత్సరములోపల పేరుపడ్డ కంట్రాక్టర్లను వశపరచుకున్నాడు. సమయంవచ్చినప్పుడు నొక్కి డబ్బులాగి అందులోకొంత పైఉద్యోగస్థులకు నెలనెలాపంపుతూ తన ఉద్యోగానికి భంగంరాకుండా కుంభకోణపుపద్ధతిపై కొట్టుకొస్తున్నాడు. కానీ కష్టపడి పనిచేసే గుమాస్తాలకుమాత్రంసున్నే! వాళ్ళపేరుచెప్పి వాళ్లవంతులుకూడా తానుపుచ్చుకోవటం మానలేదు.

---

# ౧౧

రంగనాథమునకు ఆఫీసులోపని బాగా సాగుతూవున్నది. అనగా తనక్రిందపనిచేస్తూవున్న తాబేదాలురు అయిన తెలుగువార్లు చాలా నమ్మకంగాను, విశ్వాసంగాను పనిచేస్తున్నారు. రంగనాథానికి డబ్బు— అనగా—పైరాబడి చాలావస్తుందని గుమాస్తాలు గ్రహించారు గ్రహించేదేమిటి? వాళ్ళకళ్ళముందరే, వేలకొద్దీ లక్షలకొద్దీ బిల్లులు ప్యాసవుతూవున్నవి. కాని తమకుమాత్రం చిల్లిగవ్వయైనా దొరకటంలేదు.

ఈవిషయమై గుమాస్తాలు కొద్దికాలము ఓపికపట్టారు అనగా ఒకయేడాదిదాకా వూరుకొన్నారు. ఆతరువాత వాళ్ళకు కడుపుమండ జొచ్చింది. మండదుటండీ? చెప్పండీ! వందలకొద్దీ జీతాలు తెచ్చుకొంటూ, ఆఫీసర్లమని పేరుజెప్పుకు—పైరాబడికోసం పాకులాడే వ్యక్తులు సర్వీసులోవుంటే యింక ముప్పైలు, నలభైలు తెచ్చుకొంటూ చాలీచాలనిజీతంతో యిబ్బందులు పడుతోన్న గుమాస్తాలకు ఏలాగువుంటూంది? చెప్పండి!

అసలు యిలాటిలంచగొండితనాన్ని ఆఫీసర్లనబడే పెద్దదోపిడిగార్లనుండి నిర్మూలించాలి. ఇదిఏలాగుసాధ్యమౌతుంది? వాళ్ళపై ఉద్యోగస్తులు పట్టుకోవాలి. వాళ్లెందరను పట్టుకుంటారు? వార్లకు యిటువంటి విషయాలలో జోక్యం కలుగజేసుకోకుండా వుండేటందుకునూ, చూసీచూడనట్లు వుండేటందుకును ఎప్పటికప్పుడు వాళ్ళలంచములు వాళ్ళకు ముట్టుతూవున్నప్పుడు పైఉద్యోగస్తులు యేమీకలుగజేసుకోరు.

చాలామంది ఆఫీసర్లకన్న గుమస్తాలే సీత్ పరివర్తనకలవాళ్ళు వుంటారు ఎందుకనగా వాళ్ళకుండే అధికారగర్వంలో, చుట్టూపరి వేష్టించివుండే సేవకాబృందములో, వచ్చే అధికారాబడిలో ఉన్మత్తులై వుండి తమ్ముతాము మరచిపోతారు. ఇది మానవస్వభావము. ఈప్రకారంగా రంగనాధంగారు తమహుండీపెట్టెను దినదినం నింపుతూవుండడం ఆఫీసుగుమాస్తాలు గ్రహించారు.

రంగనాధము చేతిక్రింద ఆరుగురు గుమాస్తాలు పనిచేస్తున్నారు అందులో యిద్దరు దిట్టమైనవాళ్లు. వాళ్ళపేర్లు కామేశ్వరరావు, విశ్వనాధములు ఏదైనా బిల్లువచ్చినప్పుడు దాన్ని త్వరగా ప్యాసుచెయ్యకుండా తొక్కిపెడుతూవుండేవాళ్లు. ఒకరోజున రంగనాధమునకు గుమాస్తాలకు యీవిధంగాగర్షణజరిగింది.

రంగ:—ఏమండీ కామేశ్వరావుగారు!

కామే:—సార్!

రంగ:—మీవద్దఎన్నిబిల్లులు పెండింగుగావున్నాయి?

కామే:—పదివున్నాయండి.

రంగ:—యిన్నిరోజులు ఎందుకువుంచారు.

కామే:—(మాట్లాడలేదు)

రంగ:—ఏమండీ మాట్లాడరు?

కామే:—అయ్యా! యేమిచెప్పమంటారు? అనేక కారణాలవల్ల వుండిపోయినాయి.

రంగ:—ఆబిల్లులన్నీ యిలాగపట్టుకొచ్చి ఒకొక్క బిల్లే వయేకార గాలచేత యిన్నిరోజులు వుండిపోయిందో నాకు బోధపరచండి. అలాగు సరిగ్గా బోధపరచనినాడు మీమీద చెడ్డరిపోర్టు వ్రాయవలసివస్తుంది. ఛార్జిషీటు తయ్యారుచెయ్యవలసి వస్తుంది. జాగ్రత్తగా వుండండి తెలుసునా. యింకొకవూరు బదిలీచేయించి వేస్తాను.

కామే:—అయ్యా! యేమిచెప్పమంటారు. ఈబిల్లుకు సరియైన అథారిటీ వ్రాయలేదండి. ఈబిల్లుకు—కంట్రాక్టుకు యేమీ సంబంధం లేదండి. ఈబిల్లుకు జతపరచవలసిన వోచర్లుక్రింద యింజనీరు ఆఫీసు వార్లు జతపరచలేదండి. ఈనాలుగుబిల్లులు యిదివరకే ప్యాసుచేసి మీనంతకాలకోసం వేచివుండి, వాటికి తొందర లేదని, నేనేచెప్తానని మీరన్నారండి.

రంగ:—ఓహో! అదాసంగతి! నామీదే తప్పులుచూపుతున్నావా? చూడు నిన్నుయేమిచేస్తానో! ఆఫీసర్లుతో ఎలాగమాట్లాడాలో నీకు తెలియదు. ఎంతఅణుకువ వుండాలి. ఎంతవినయంగా మాట్లాడాలి. ఎంతచక్కగా బోధపరచాలి. ఆఫీసుపనులు చేయడానికే మీకు యింతవిసుగ్గావుంటే—మారోజుల్లో మేము ఉద్యోగస్తులకు యింటివద్ద ప్రయివేటు చాకరీకూడా చేశాము.

కామే:—అదంతా ఎందుకుసార్! వున్నసంగతేదో స్పష్టంగా చెప్పాను.

రంగ:—ఓహో, అదాసంగతి. ఏదియిలాగపట్టుకురా—నీవు చెక్కుచేసినబిల్లు, యిదిగో—యిక్కడ గుణకారంతప్పు. యిక్కడ

కూడికతప్పు. యిన్నితప్పులతో కూడుకున్న బిల్లును నన్ను యేవిధంగా సంతకం పెట్టి ప్యాసు చెయ్యమంటావు?

కామే:—బాబూ! మీవద్ద బ్రహ్మదేవుడైనా పనిచెయ్యలేడు. మీకడుపులో వుద్దేశ్యాలువేరు. నామీద అక్రమంగా నిందమోపు తున్నారు. ఆఫీసర్లను నేనుఎప్పుడూ ఎదిరించే వాడినికాను. నాకు పది సంవత్సరాలసార్వీసు వుండండి.

రంగ:—యికచాలు. వెళ్ళు నీసీటులోనికి. తెలుగువాడు.నిండా పొగరుబోతు. ఎక్కువగా ఆర్గుమెంటు చేస్తాడు.

---

# ౧౨

రంగనాథము మంచిహోదాలోకి రావటంచేత అతనియింటి పద్ధతిఅంతా మార్చివేశాడు. శుభ్రమైనయిల్లు తీసుకున్నాడు. ఆయింటికి కిటికీలకు 'కెర్టన్లు' కట్టినాడు. ఇంటి ముందుగుమ్మమునకు చక్కటి పువ్వులగుడ్డ కట్టినాడు. సావిడి ముస్తాబుచేసినాడు. సావిట్లో అరడజనుకు తక్కువకాకుండా ఆఫీసునుంచే కుర్చీలు తెప్పించి యింట్లో వేయించుకుని హాయిగా వాడుకుంటున్నాడు.

సావిట్లో రెండుబల్లలు ఒక ఈజీచెయిరు కూడా అమర్చాడు. ఇదిగాక మయంగా చిన్నస్టూలుబల్లవుంచి దానిమీద చక్కటి తెల్లటి అల్లికగుడ్డ వేసి అందిమీద పూలకుండీవుంచాడు. దినదినము ఆపూలకుండీని ఆఫీసుబంట్రోతు మారుస్తూవుండాలి.

తనభార్యాకు ఎప్పుడుపిలిస్తే పలికేటందుకు, తనపిల్లలను ఆడించేటందుకు ఆఫీసునౌకరునే ఒకణ్ణి తనయింటివద్ద వేసుకున్నాడు. గవర్నమెంటు లెక్కల్లోమాత్రము ఆబంట్రోతు ఏదోపని చేస్తూన్నట్లు చూపించి జీతం ప్రభుత్వంలోనుంచియిచ్చి తనయింటివద్ద అరవచాకిరీ చేయించుకునేవాడు.

ఒకరోజు ఆదివారమునాడు అతడు పదకొండుగంటలకు భోజనం చేసి సావిట్లో ఈజీఛైరులోపడుకుని తాయారమ్మతో కబుర్లుచెప్తున్నాడు. తాయారమ్మ అతనికి తమలపాకులకు సున్నమురాసి యిస్తూవున్నది. చిన్నపిల్లలు యిటూఅటూ తిరుగుతూ ఆడుకుంటూ

వున్నారు. ఇంతలో హిందూపత్రిక కుర్రవాడు తెచ్చి అందిచ్చిరాడు. అప్పుడు తాయారమ్మ కొంచెము నవ్వింది.

రంగ:—ఎందుకు తాయారు? నన్నుచూచి అల్లా నవ్వుతావు.

తాయా:—అబ్బే ఏమీలేదు. వూరికే నవ్వువచ్చింది నవ్వుకున్నాను.

రంగ:—అదికాదు చెప్పు ఏదో కారణముంటుంది ఏదో విశేషము లేనిదే నువ్వు నవ్వేదానివికావు నాకు తెలుసు.

తాయా:—ఏమీలేదు. వూరికే నవ్వేను.

రంగ:—అదికాదు చెప్పు

తాయా:—ఏమిచెప్పమంటారు? ఇప్పుడుమీరు చక్కగా పెద్ద దొరలాగువున్నారు. మనకు బంగ్లాతోటలు, నౌఖర్లు చాకర్లు, దండిగా డబ్బు, వస్తువాహనాలు, అన్నీవున్నాయి. పైగా దొరగారిలాగు మీరు కూర్చుంటే మీకాళ్లదగ్గర ఆ పేపరుగాంచటం —యివన్నీచూచి నాకు నవ్వువచ్చింది మొన్న మనము ఎంతయిబ్బందిపడ్డాము చెప్పండి.

రంగ:—అందుకునా? నీకునవ్వింది. వెర్రిదానా? ఎప్పుడూ ఒకే లాగు వుంటామూ, నేను యింతటిమాంగుడానే ఆఫీసరు అయిపోయి వుండవలసినవాడినిగా. నాకు యింతకాలిండా ఆలశ్యంగా ఆఫీసరుపని వచ్చివుండాది. ఏమిచేసేది చెప్పు. అదిమన అదృష్టము. శ్రీనివాసుల కృప మనకు ఆలశ్యంగా వచ్చివుండాది.

తాయా:—ఏమిచేస్తాము ఎందుకు మీకు యింకావిచారము, ఆఫీసరు అయ్యేరుకదా?

రంగ:—అదికాదుతాయి. ఆఫీసరు అయినానుశే. కాకుంటా వుండిపోమనా? ఏమిటిమీ! నేనుచెప్పేదిఏమంటే—నాకన్నా జూనియర్ వాండ్లు, కురర్రివాండ్లుదాయిట్లే, యిట్లేచూస్తూవుండగా పైకిపోయినారు. నేనుదానే అట్లావుండిపోతిని. కడకు పెరుమాళ్ళకృపవల్ల పైకివస్తిమి

తాయా:—ఈవూరు మనకు బాగావున్నదండి. విశాఖపట్టణముకన్న నయంకదూ?

రంగ:—విశాఖపట్టణానికి ఈవూరుకు తెచ్చావుపోలిక! అది చవిటిపర్రి, త్రాగుదామంటే గుక్కెడునీళ్ళైనా దొరకవుఆవూళ్లో. ఇదియేమి? రాజాపూరు. అన్నివస్తువులుచౌక.

తాయా:— చౌకఅని నెమ్మదిగా చెప్తారూ? అన్నివూళ్లకన్నా బాగాచౌక. గోదావరిజిల్లా చాలామంచిదండి. మనము చాలాకాలము బదిలీకాకుండా యిక్కడనేవుండేట్లు ఏలాగో పైఆఫీసుదొరగారితో చెప్పి వుంచుకోండి. ఈవూళ్లోవుంటే మనకు నాలుగుడబ్బులు మిగులు తాయి.

తాయారమ్మ రంగనాథము యిలాగు తమయింటినిగూర్చి తమ పూర్వపుఅనుభవాలనుగూర్చి భావిజీవితాన్నిగూర్చి మాట్లాడుకుంటూ వుండగా "అయ్యగారూ" అని కేకవినపడింది. ఆకేక తనయింట్లో పనిచేస్తూవున్న బంట్రోతు నరసింహులుది.

రంగ:—నరసింలూ!

నర:—అయ్యా!

రంగ:—ఎందుకురా? పిలుస్తున్నావ్?

నర:—ఏమీలేదండయ్యా! తమకోసము వోరుసీలుగా వొచ్చారండి,

రంగ:—ఎక్కడవున్నారు?

నర:—ఈధిలోవున్నారండి.

రంగ:—వాళ్ళొక్కరేవున్నారా? వారితోపాటు యింకెవరైనా వున్నారా?

నర:—వారున్నూ, వారిగుమాస్తాగారు, వెంకటాద్రిజుగారు వచ్చారండి.

రంగ:—అయితే లోపలికిరమ్మను.

తాయారమ్మ పిల్లలను తీసుకు లోపలికివెళ్ళిపోయింది. రంగనాధము కళ్ళద్దాలు సవరించుకుంటూ ఠీవిగా ఈజీచైరులోకూర్చొని హిందూపత్రిక చదువుతూ దర్జాగా కాళ్ళుకదుపుతూవున్నాడు. కొద్ది సేపటికి జోళ్ళు చప్పుడుచేసుకుంటూ ఓవరుసీరు ఆనందరావుగారు ఆయనగుమాస్తా వెంకటాద్రిజుగారు లోపలకుప్రవేశించారు. లోపలకు రాగానే ఆనందరావు, వెంకటాద్రిజుగారిద్దరూ రంగనాధముకేసిచూసి "గుడ్ మార్నింగ్ సార్" అని ఒకేమాటు అన్నారు. రంగనాధం అప్పటిదాకా ముఖానికి అడ్డుపెట్టుకున్న హిందూపేపరుతీసి తొడలమీద మడిచిపెట్టి 'హల్లో! వెరీగుడ్ మార్నింగ్! కూర్చోండి. ఏమి యిల్లా వస్తిరి. ఒరే! అప్పా! పెద్దబ్బాయి! అని పిలిచాడు. రంగనాధముగారి పెద్దబ్బాయి పరుగెత్తుకుంటూ వచ్చేడు తండ్రివద్దకు. "ఒరే అమ్మతో చెప్పి రెండుకప్పులకాఫీ తయారుచేయించి పట్టుకురారా!

'ఎందుకండీ? సార్! యిప్పుడు కాఫీ. భోజనంవేళ కావచ్చింది యింటికిపోయి భోజనంచేస్తాము. ఈపాయంటు మీకు చూపించుదామని వచ్చేముగాని అంతకుమించి వేరు లేదు!'

'అట్లా అంటారేమి. మీరు ఏపొద్దువచ్చినా కాఫీవుండును మన యింట్లో. యింటికి వచ్చినవారికి కాఫీ తప్పకుండా యివ్వవలెదా. అదీదామామర్యాద. మాదేశసాంప్రదాయం.' అన్నాడు రంగనాథం.

ఆనం:—చిత్రం. చిత్రం. యిటుచూశారా? మీరు బిల్లుపాసు చెయ్యకుండా త్రిప్పివేశారు.

రంగ:—అవునయ్యా! ఎట్లాపాసుచేయుమంటావు? ఆసందులో పెట్టినగోడకుకూడా బిల్లులోమీరు జమకట్టేరే, ప్లానులోగోడఎక్కడా లేదు. ఎట్లాపాసు చెయ్యమంటారుబిల్లు?

ఆనంద:—అయ్యాబాబు! అసలు ప్లానులోలేనిదానికి బిల్లుచేశానని అనుకున్నారా? ఏమిటి? వెంకటాప్రిజుగారు ఒరిజనల్ప్లాను చూపించండి మొదలియార్ గారికి.

(అని యిద్దరూకలిసి పెద్దప్లాను రంగనాథముకు చూపిస్తారు)

రంగ:—అవును. యిందులో గోడవున్నది కాని మీరు బిల్లు పంపినప్పుడు దానితోజతపరచి చిన్నప్లానులోమాత్రం గోడచూపించ లేదు.

ఆనంద:—చిత్తగించారుగదాండి. అదిగదేనండి పొరబాటు. చిన్నప్లానుగీసేటప్పుడు ఆఫీసులో డ్రాఫ్సరు ఆగోడ పొరబాటున గీయటం మరచిపోయినాడండి. దానిమీద మీరు బిల్లుసరిగ్గా లేదని త్రిప్పేశారు.

రంగ:—తిప్పివెయ్యక ఏమిచెయ్యమంటారూ?

ఆనందం:—ఈమాటు ఆతప్పుసవరించి పంపిస్తాము త్వరగా ప్యాసుచేయించండిబిల్లు

రంగ: — ఓ! అభ్యంతరమేమిటి.

యింతలో రంగనాధంగోడుకు రెండుకప్పులు కాఫీ తెచ్చి యిచ్చాడు. ఆనందరావు, వెంకటాద్రివు చెరోకప్పు త్రాగేరు.

ఆనంద:—మాకు శెలవిప్పించండి. నమస్కారంసార్!

వెంక:—నమస్కారంసార్.

రంగ:—ఎస్. నమస్కారం. (కారిడ్డరూ వెళ్ళిపోతారు)

---

కామేశ్వర్రావుమీద రంగనాథమునకు చాలాకోపమువచ్చింది. ఆకోపము అప్పటితో పోలేదు. అదిఅతడు మనస్సులో వుంచుకున్నాడు. అలాగు తన్ని ఎదిరించినవాడిని ఆఫీసులో వుంచకూడదని అతని నిశ్చయం. అందుచేత అతడికి యేవిధముగా తగినశాస్తి చెయ్యవలెనా? అని ఆలోచనచేయుటము మొదలుపెట్టినాడు.

ఆరునెలలకొకమాటు పైఆఫీసువాళ్ళు తనక్రింద ఉద్యోగస్థుల మీద తమఅభిప్రాయాలను పంపమంటారు. అదిగాక తనకుతోచి నప్పుడు ఫలానావాడు సరిగ్గా పనిచేయడములేదనిచెప్పి ఆఫీసు బాగు పడాలంటే అతడిని ట్రాన్సుఫర్ చెయ్యవలెనని గట్టిగా వ్రాయవచ్చు.

ఆప్రకారంగానే ఆరునెలలు పోయినతరువాత తనయొక్క తాబేదారులమీద రిపోర్టులు పంపమని పైనుంచిరాగానే, కామేశ్వర రావు తలబిరుసువాడని, పైగా స్వదేశంలో అతడికి పని అవటంచేత ప్రయివేటుపనులు జాస్తిఅనిన్నీ అందువల్ల అటువంటివాడిని దూర దేశం ట్రాన్సుఫర్ చేయాలని వ్రాసినాడు.

పైఅధికారులకు సత్యాసత్యములు అక్కరలేదు. గుమాస్తాఅన్న వాడు ఎంతమంచివాడు అయినప్పటికి ఎప్పుడేనా ఆఫీసరుని తిరస్కరిస్తే అదిఅతడు మనస్సులోవుంచుకొని ఆవ్యక్తికి తీరనిఅపకారం చేయగలడు. పైగా కామేశ్వరరావుకి బదులు ఎవరినేనా ఒకదక్షిణాత్ముడిని వేస్తే పనిబాగా జరుగుతుందని వ్రాశాడు.

దానితో కామేశ్వరరావును నెల్లూరు బదిలీచేశారు. అక్కడ నుంచి సౌందరరాజ్ అనే ఒక తమిళసోదరుడు వచ్చేడు. అతడుపని, ఆఫీసులో వర్కు చేయుటం అటువుంచి, తోడిగుమస్తాలమీద కబుర్లు వ్రాయటమేపని

ఒకరోజు విశ్వనాథం ఒక స్టేటుమెంటు రంగనాథముగారి సంతకానికి తీసుకువెళ్ళేడు అతడుచేసిన స్టేటుమెంటు తప్పుఅన్నాడు. రంగనాథంగారు అదిరైటుఅన్నాడు విశ్వనాథం. పెద్దఆఫీసరైన తనతో వాధించాడన్న కోపం అతడిమీాదవున్నది.

కనుక అతడుచేసిన స్టేటుమెంటు తప్పుఅనీన్నీ తానుచెప్పిన విధంగా చేయుమని కోప్పడ్డాడు. రంగనాథం చెప్పినట్లు విశ్వనాథం తయారుచేశాడు. అదిపైఆఫీసుకు పోయింది. అక్కడ యిదితప్పు అవటంవల్ల యిటువంటి తప్పుడుస్టేటుమెంట్లు యికముందు పంపవద్దనీ పైఆఫీసువారుపంపు సర్క్యులర్లు సరిగ్గా అర్ధంచేసుకోవలెననీ ఆస్టేటు మెంటును త్రిప్పికొట్టేరు.

రంగనాథానికి తనతప్పు తనకే తెలిసిందికానీ, తానుయేముఖముపెట్టుకు తనవాదనను సమర్ధించుకోగలడు? అందుచేత విశ్వనాథాన్ని పిలచి యిలాఅన్నాడు.

'మిస్టర్ విశ్వనాథం నీవు మరియొక్క స్టేటుమెంటును తయారుచేయ్యాలి.'

విశ్వ:—ఎందుకండీ,'

రంగ:—ఎందుకో ఎరగవా?'

విశ్వ:—ఎరగ కేమండి. అది 'తప్పు'' అని పైఆఫీసునుంచి త్రిప్పి వేయబడింది గనుక.

రంగ:—అవునుగదా! అన్నీ అర్థమయ్యే నన్ను ఎందుకు అడుగు తావూ?

విశ్వ:—అదికాదండి నేను మొదట్లోనే చెప్పాను తమతోటి.

రంగ:—ఏమని చెప్పావు?

విశ్వ:—ఏమనేమిటండి, నేను మొదట్లో తయారుచేసిన స్టేటు మెంటు చాలాసరియైనదనిన్నీ, అందులో మార్పులు చేయనవసరము లేదని విన్నవించాను.

రంగ:—సరే—బాగానేవున్నది. యిప్పుడు యింకోటి సరిగ్గా తయారుచెయ్యండి.

విశ్వ:—యింకోటి ఎందుకండి. వెనకటిదే పంపించివెయ్యండి.

రంగ:—అది తప్పుదేమో!

విశ్వ:—కాదనినేను చెప్పుతున్నాను గాదుటండీ!

రంగ:—నాకన్న నీకు బాగా తెలుసా? యిరవైసంవత్సరాలపై సర్వీసు వున్నదినాకు.

విశ్వ:—'.........' (మాట్లాడలేదు.)

రంగ:—ఏమిజవాబు చెప్పవు?

విశ్వ:— ఏమిచెప్పమంటారు మీదగ్గర. మీరు అధికార్లు ఎక్కువగా మాట్లాడితే మీకు కోపంవస్తుంది. అంతకన్న మార్చిచెయ్యటం నాకు రాదండి.

రంగనాథానికి చాలాకోపంవచ్చింది. విశ్వనాథము చెప్పినది రైటుఅయినప్పటికి అదివిజమో కాదో నిర్ణయించగలశక్తి అతనివద్దలేదు. ఎట్టకేలకు అదితనకు యిష్టములేకపోయినా, యింక ఆఫీసులో ఆపని చెయ్యగలవాళ్ళు లేకపోవటంచేత అదేపంపించాడు. అదిరైటని పైఅధికార్లు అన్నారు. అప్పటినుంచే రంగనాథం, విశ్వనాథం తెలివైనవాడని గ్రహించి, తెలివైన తెలుగువాడు పైకిరాకూడదని పిల్లిమీదో ఎలుకమీదో పెట్టి మందలిస్తూ తనకాలుకింద నొక్కుతూనేవున్నాడు. కుంభకోణపు ఆసామీఅయిన రంగనాథం బదిలీఅయిపోతేనేగాని విశ్వనాథం ప్రాణానికి సుఖముండదని తోడిగుమాస్తాలందరు అనుకుంటున్నారు!

సమాప్తి.

Paper Supplied by Party Q. H. E. G. 34.

శ్రీరామ ప్రెస్, రాజమండ్రి



# జాతీయనాయకుల జీవితములు

మహాత్మగాంధి, జవహర్లాలునెహ్రూ, హిట్లర్ దురంతములు, సుభాషచంద్రబోస్, చిత్తరంజన్‌దాస్, రాజగోపాలాచారి, మదనమోహనమాలవ్యా, రవీంద్రనాథ టాగూర్, అబ్దుల్‌కలాం అజాద్, జనాబ్ జిన్నా, జైహింద్, పటేలుసోదరులు, జాతీయనాయకుల జీవిత చరిత్రలు ఇంకా ఎన్నో జీవితచరిత్రలు దొరకుస్థలము:—

పసుపులేటి బాపిరాజు,
శ్రీసత్యనారాయణ పబ్లిషింగ్ హౌస్,
రా జ మ ం డ్రి.



# మిలిటరీ నర్సు

## 1 వ భాగం

రచయిత:

శ్రీ పోలుకొండ దానియేలు



స్టాకిస్టు:

యస్. అప్పలస్వామి & సన్సు

బుక్సెల్లర్సు :: రాజమండ్రి.